విశ్వ జనీన గ్రంథావళి

సంపాదకుడు: శ్రీ నోరి నరసింహ శాస్త్రి

# రత్నాకరము

సాహితీ సమితి

రేపల్లె. తెనాలి, గుంటూరు.

రాజమహేంద్రవరము. పిఠాపురము.

మారేడుపల్లి-సికిందరాబాద.

నాంపల్లి-హైదరాబాద (దక్షిణ)

# రత్నాకరము

(గీతికా సంపుటము

తల్లావఝ్ఝల
శివశంకర శాస్త్రి

సాహితీ సమితి
సికిందరాబాద . హైదరాబాద

# హర్మ్యాగ్రము

(సంధ్యాసమయము. అలంకరించి యున్నగదిలో తల్పముమీద శ్రీమర పండుకొని యుండును. ఆమెసఖి శాంత ప్రక్క నున్నది.)

శాంత

ఏల విలపించుకో వీయా స్త్రజనవాక్కు ?
నీకోపమ్మై మేము నెగులుపా త్రైతిమే !
ఓ చెలీ, ఓ చెలీ, ఊర్పుతావులె కాని
పలుకుతేనియ చినుకు చినుక వేమే చెవుల ?

ఓసఖీ, ఓసఖీ, ఊరకే నావైపు
శూన్యదృక్కులతోడ చూచుచున్నా వేమె !
వింతవర్తనముచే వెర్రి యేమో యన్న
శంక మామతులలో జనియించుచున్న దే !

ఓచెలీ, ఓచెలీ, ఒకకొంత తడ వేలొ
నవ్వితివి జాలిగా నామోము వీక్షించి.

నిర్నిమేషమ్ముగా నింగి నవలోకించి
మరికొంత తడవునకు మందస్మితాస్యవై
ఓసఖీ, ఓసఖీ, ఒత్తిగిలి యొకవైపు
గాత్రవల్లిక స్వయంగ్రాహమ్ము చేసితివి !

నెచ్చెలీ, నెచ్చెలీ, నీగభీరస్వాంత
రత్నాకరమ్ములో రాజుచున్నది కీలి ?
మౌనముద్రిక వీడి, మర్మమ్ము విడనాడి
నీవ్యథం దెలుపవా నెచ్చెలీ, నెచ్చెలీ ?

పలుకవా పలుకవా, పాటలాధరదీప్తి
వంతస్మితము వేయ నగునె యాస్యమ్ములో ?

నీలోలకుంతలా నిచయమ్ము నెచ్చెలీ,
చెక్కుటద్దములలో చిక్కువడ్డది సుమీ!
నాసఖీ, నాసఖీ, నగుమోము నెలవంక
కాలధారాధరాక్రాంతమ్ము కా నేల ?
ఆదిత్యభగవాను డస్తమించుటజేసి
ముకుళించెనా నీదు ముద్దుకమలాదామరల్ ?

చూడవే చూడవే శోభామయం బైన
ఉద్యానవనవాటి నోచెలీ, ఓచెలీ !

మరకతోన్నతపీఠి మల్లె యారోహించి
ఓలగం బున్నదే యుద్యానసీమలో.
చూడవే చూడవే, శోణకుబ్జాకంబు
కంటకాంబికములన్ గాచుచున్నది వనిన.

జాలమార్గమువెంట చల్లగా మెల్లగా
మలయుచున్నది పవి, మంద పవమానంబు.

## పూర్వభాగము

విడువవే, విడువవే, విడువవే తల్పాంతు,
విరిసెజ్జపై చెలీ, విశ్రమింతువు గాని.

ఒంటిగా గూర్చుంద మొపవనమ్మున మనము:
నీ మనసులో బాధ విమ్మశించును కొంత,
ప్రియసఖీ, ప్రియసఖీ బిగువు విడువవె యింక,
భాగించుకొందు నీ బాధ యేదో గాని.

పలుకవా పలుకవా, ప్రాణాధికవు నిన్ను
విసిగింప కికనైన వెడలిపోదును గదే ;
కనుదోయి దెరచి నన్ గనుగోని పలుకవ
నిష్క్రమించెదుదాన నెచ్చెలీ నెచ్చెలీ ;

## భ్రమర

( లేచి, తల్పముపై గూరుచుండి )

పీడ చనలేకు మీవేళ నను ప్రియసఖీ ;
వాళజాలక తలపుతరగ గమితాకులకు
వెతల పాలైన యీవివశ దుర్బలహృదయ
పీడ....

మానసులోని సముద్రమథనమ్ము ప్రియసఖీ,
తెలుపు టెటులో నాకు తెలియకున్నది గదే
పీడ....

అనురాగవతి యైన అమ్మ కీవరలోనె
కొలదిగా నామీద కోపరేఖలు కలవు
వీడి....

క్షోభించి క్షోభించి క్షుద్రజీవితముపై
అంతంత మాత్రమే ఆసక్తి మిగిలినది
వీడి....

శాంత

( తర్జని నోటిపై నుంచికొని )

అశుభవాక్కులు నోట అనుచితము రానిచ్చు
టైన వెగటేల చెపుమా,
ఓ చెలీ, అపుడె జీవనలీలపై?

ఆరోగ్యవతివి నీ వాహ్లాదము త్యజించి
బ్రతుకుపై రోసినావే
ఓ చెలీ, ప్రథమ యౌవనమునందే!

కావ్య నాటక కథాగ్రంథజాలము తెరవ
కవిశమ్మ పర్యంకమే
ఓ చెలీ, ఆశ్రయించెద వేటికే!

మనములో దిగులుచే మధవపకు చీరీతి
ఊరకే కృశియింతువా, ఓ చెలీ,
ఉచిత మేమో చూడవా!

## పూ ర్వ భా గ ము

గుప్తి యేటికి? నీకు గూర్చుదానను గదా
ఎవనిపోవగ నేటికే, ఓ చెలీ,
నాకు వివరింపరాదే!

### భ్రమర

(దీనముగా చూచుచు)

నీవే నాకు, నీవే నాకు
నావవు దుఃఖనదిని గడప....నీవే....

చింతాక్రాంత చిత్తమునందు
సడలిపోయెను సహజ పటిమ....నీవే....

తేకువ యెట్లా తెచ్చుకొనుచు
తెలుపుదు మనసుతెరగు చెలీ!....నీవే....

ఆదిని నాకు అభయహస్త
మొసగ వలయు ఓరిమితోడ....నీవే....

అలుక పూనవలదు నాపై:
చెలీ, అపుడు చెప్పగల్గుదు....నీవే....

హేయభావ మెంతమాత్రము
చెలీ, నాపై కలుగ రాదు....నీవే....

## శాంత

( భ్రమరను కౌగలించుకొని ముద్దాడి )

నన్నిపుడైనను నమ్మవె ప్రియసఖి!
ఏటిపలుకు లివి! హేయభావమా
ఎన్నడు గానీ ఏగతి గలుగును....న....

నీకయి చెలియా, నే నెది యైనన్
వింతు మనసుతో నెరవేర్తునుగా....న....

ఏది హితమొ నీ, కేయది సుఖదమొ
శ్రమ మవి యెంచక సమకూర్తునుగా....న....

తనువులు రెండుగ కనబడుచున్నను
అంతరంగముల నద్వయరూపమె....న....

## భ్రమర

అమ్మ భ్రమ్మర నన్ను అత్తవారింటికే
పొమ్మనుచు పలుమారు పోరు పెట్టుచునున్న
దేమి చేయుదు సఖీ, ఏది మార్గము నాకు!

నా నుదిటిపై శాంతి నలువ వ్రాయనె లేదు!
దీర్ఘ జీవితము నేతెరగునత గ[illegible]ను!
ఏమి....

క్షీరసాగర మథన నిలయము

ఉ.వి. హిందోళ రాగం

విడువవే, విడువవే, విడువవే తల్పంబు,
విరిసెజ్జపై చెలీ, విశ్రమింతువు గాని.

ఒంటిగా గూర్చుండ ముపవనమ్మున మనము.
నీ మనసులో బాధ నిమ్మళించును కొంత,
ప్రియసఖీ, ప్రియసఖీ బిగువు విడువవె యింక,
భాగించుకొందు నీ బాధ యేదో గాని.

పలుకవా పలుకవా, ప్రాణాధికవు నిన్ను
విసిగింప కికనైన వెడలిపోదును గదే!
కనుదోయి దెరచి నన్ గనుగొని పకపక
విష్క్రమించెదుదాన నెచ్చెలీ నెచ్చెలీ!

భ్రమర

( లేచి, తల్పముపై గూరుచుండి )

వీడి చనబోకు మీవేళ నను ప్రియసఖీ!
తాళజాలక తలపుతరగ గమితాకులకు
వెతల పాలైన యీవివశ దుర్బలహృదయను
వీడి....

మనసులోని సముద్రమథనమ్ము ప్రియసఖీ,
తెలుపు చెటులో నాకు తెలియకున్నది గదే
వీడి....

అనురాగవతి యైన అమ్మ కీవరలోనె
కొంలదిగా నామీద కోపరేఖలు కలవు
వీడి....

క్షోభించి క్షోభించి క్షుద్రజీవితముపై
అంతంత మాత్రమే ఆసక్తి మిగిలినది
వీడి....

శాంత

( తర్జని నోటిపై నుంచికొని )

అశుభవాక్కులు నోట అనుచితము రానిచ్చు
టైన వెగ టేల చెపుమా,
ఓ చెలీ, అపుడె జీవవల్లిలపై :

ఆరోగ్యవతివి నీ వాహ్లాదము త్యజించి
బ్రతుకుపై రోసినావే
ఓ చెలీ, ప్రథమ యౌవనమునందే :

కావ్య నాటక కథాగ్రంథజాలము తెరవ
కవిశమ్మ పర్యంకమే
ఓ చెలీ, ఆశ్రయించెద వేటికే :

మనములో దిగులుచే మదనపడు చీరీతి
ఊరకే కృశియింతువా, ఓ చెలీ,
ఉచిత మేమో చూడవా :

## పూర్వ భాగము

గుప్తి యేటికి? నీకు గూర్చుదానను గదా
ఎవసిపోవగ నేటికే, ఓ చెలీ,
నాకు వివరింపరాదే!

## భ్రమర

(దీనముగా చూచుచు)

నీవే నాకు, నీవే నాకు
నావవు దుఃఖనదిని గడప....నీవే....

చింతాక్రాంత చిత్తమునందు
సడలిపోయెను సహజ పటిమ....నీవే....

తేకువ యెట్లో తెచ్చుకొనుచు
తెలుపుదు మనసుతెరగు చెలీ!....నీవే....

ఆదిని నాకు అభయహస్త
మొసగ వలయు ఓరిమితోడ....నీవే....

అలుక పూనవలదు నాపై:
చెలీ, అపుడు చెప్పగల్గుదు....నీవే....

హేయభావ మెంతమాత్రము
చెలీ, నాపై కలుగ రాదు....నీవే....

## శా ం త

( భ్రమరను కౌగలించుకొని ముద్దాడి )

న న్నిపుడైనను నమ్మవె ప్రియసఖి!
ఏటిపలుకు లివి! హేయభావమా
ఎన్నడు గానీ ఏగతి గలుగును....న....

నీకయి చెలియా, నే నెది యైనన్
వింతు మనసుతో నెరవేర్తుమగా....న....

ఏది హితమొ నీ, కేయది సుఖదమొ
శ్రీమ మది యెంచక సమకూర్తుమగా....న....

తనువులు రెండుగ కనబడుచున్నను
అంతరంగముల నద్వయరూపమె....న....

## భ్రి మ ర

అమ్మ క్రిమ్మర నన్ను అత్తవారింటికే
పొమ్మనుచు పలుమారు పోరు పెట్టుచునున్న
దేమి చేయుదు సఖీ, ఏది మార్గము చాటుమా:

నా నుదిటిపై శాంతి నలువ వ్రాయనె లేదు!
దీర్ఘ జీవితము వేతెరగునం గడుపుదును:
ఏమి....

అమ్మ కెప్పుడు లోక మన్న భయమే కాని
పుత్రికా హృదయంబు పొగిలిపోవుట యెరుగ
దేమి....

అనురాగ రహిత మైనట్టి కాపురము నే
చేయ లే నని చాల చెప్పి యేడ్చితి నెంతొ
ఏమి....

అగ్నిహృదయం బున్న, ఆధునికహృదయాల
అనురాగ విధ మేమొ అమ్మ యెరుగనె యెరుగ
దేమి....

అచటి కేగుటకన్న ఆత్మహత్యయె మేలు!
పడలేను, పడలేను బాధ లీపయి సఖీ!
ఏమి....

శాంత

పోవలదు లే అచటి కింక - అమ్మ
పోర దీపయి విడువు శంక.

ప్రసవకోమల మెనయెడద - నీది
బాధ పెట్టిన మొదలె చెడద!....పోవలదు....

యమయాతనలు మరల వలదు—నీకు
అమ్మసన్నిధి శాంతి కలదు—ఆమె

వేరుగా భావింపబోదు—మదిని
వెత నీవు పెట్టుకోరాదు....పోవలదు....

ఉల్లాసకర మైన వింట—చెలియ,
ఉన్న వెన్నో—నేను జంట....పోవలదు....

## భ్రమర

( ఈషదుత్సాహముతో )

అవును సఖీ, అవును సఖీ,
అమృత తుల్యవాణి సఖీ,
కాని నీవు జీవితమున
కష్ట మెరుగ లేవు సఖీ....అవును....

అనుకూలం బైన దట ర
ఆదరించుచుంద నిన్ను
ఎటుల విదిత మగును నీకు
ఈ హృదయజ్వాల సఖీ....అవును....

జీవన మరుభూమిలోన
చింతతోడ రగిలి రగిలి
శోషణమ్మె కాంతు గావి
సుఖ వర్తిపలు కానబడునె ? .. అవును....

పరికృత స్థితియందు నిరత
బాధ పడుచు నుంటె కాని
ఇచటగూడ శాంతి లేదు!
ఏమి చేయ దగును సఖీ!....అవును....

శాంత

గతముకన్న నీకు భావి
కాలము తిరిగుఅమ్మ కదా?
జీవయాత్ర యేవిధాన
చేయగలవు ప్రాణసఖీ!

పుట్టినింట నైన శాంతి
పొందజాల వేని చెలీ,
ఎచట సుఖము కలదు నీకు?
ఎవరు కూర్చువారు కలరు?

నీయవస్థ గాంచుకొలది
నింతదుఃఖ ముదయ మొందు.
సౌఖ్య మొందు మార్గ మేది
జన్మములో ప్రాణసఖీ!

భ్రమర

అట్టితోవ దొరకునేని
అవరోధము చూపవుకద?

శాంతి గాంతువేవి సఖీ,
సమ్మతంబె కదా నీకు ?

అమ్మతోడ జెప్పవు కద ?
అవల నన్ను నిరుత్సాహ
పంకమందు ద్రోయవు గద
ప్రాణసఖీ. ప్రాణసఖీ !

శాంత

చెలియ, నీ వింతగా చెప్పగా వలెనె !
అమ్మకు నీవార్త అవంతయేని
కర్ణగోచర మేల కావలె నోసి !

గుప్తముగా నుంతు క్రొత్త వృత్తాంత.
మెరిగింతు నిజముగా హిత మేనా నీకు,
చూచి సంతోషింతు సుఖ మబ్బునేని.

భ్రమర

చూచినా నొకవాడు శుభముహూర్తమునందు
రమణీయ మౌనూత్నరత్నాకరం బొకటి.
గాంభీర్యధామమ్ము. కాని భయదము కాదు,
లావణ్యనిధి యయ్యు లవణార్ణవము కాదు,

అమృతకలశమె, కాని హాలాహలము లేదు,
పవనాహతికి తుంగభంగముల్ రేగవే!

ఆస్పర్శచేత నే నఖిలచింతలు వాసి
ఆనందమూర్తినై అమృతంపు దీవినై
రత్నప్రభల వెల్గి రమణీయరూపాన
రత్నాకరమ్మునై రంజిల్లుదును సఖీ!

శాంత

కాంచియుందువు చెలీ, గౌతమీ ద్వార
రమ్యదేశమునందు రత్నాకరమ్ము,
అరుగుదెంచిన దాది అచ్చోటనుండి
నెచ్చెలీ, నెచ్చెలీ, నీలోనిమార్పు
అంత కంతకు నాకు అవగతం బయ్యె.
మరుగుచేసితి వాక్కొ మాసకాలమ్ము
విస్పరముగ చెలీ, నీరహస్యమ్ము!

ప్రణయ వృత్తాంతంబు ప్రథమమ్మునుండి
విడువకుండ క్రమమ్ము వివరింప గదవె!

భ్రమర

అప్రభాతము వేళ ఓ శాంతా
అభిజనుల సౌధాన ..

కుట్టిమము వేదిపై ఓ శాంతా . .
కూర్చుంటి వదినతో ..

ఆయింటి భామినుల కో శాంతా
ఆప్తురాలట వదిన . . ..
కుశల మడిగిన పిదప ఓ శాంతా
గోష్ఠి చేసిరి వారు. ..
నే పరధ్యానముగ ..
వింగి కాంచుచునుంటి ..
చూచుచుండగ నట్లు ..
సూర్యకాంతులు పడిన వో శాంతా
మస్తకమ్మును ద్రిప్పి ఓ ..
మరల కన్నులు విప్ప ..
ఆవిర్భవించినది ..
అభినవాకారమ్ము ..

శాంత

( బుజము తట్టి నవ్వుచు )

అంత యభినవ మైన ఆకార మెక్కొ-
దిగ్భ్రమ పుట్టించు దివ్యతేజంబో ।
పురవివాసమునం దపూర్వ మైనట్టి
మోహనాకృతి గాంచి ముగ్ధ వైనావా ।

( తేరిపార జూచును )

భ్రమర
( ముసి ముసి నవ్వుతో )

అట్టాలకమునుండి ఓ శాంతా
ఆపురుష విగ్రహము ..
వాల్చె నిజశీఘ్రమ్ము ..
వంపు సోపానములు ..
దిగుచుండు సమయాన ..
తిలకించినా నమ్మ ..
చివర సోపానమ్ము ..
చేరినంతనె నన్ను ..
విప్పుకన్నులతోడ ..
వీక్షించె ఆమూర్తి ..

శాంత
ప్రథమ వీక్షణమందె యాతడు
భ్రమర కీటంబైన న్యాయము
చెప్పుచున్నవి జాజువారిన
చెక్కిటులు చెలియా!

భ్రమర
తెలియకుండగ నాకె ఆయ్యెడ
దేహ మెట్లో లేచి నిలిచెను

వేదికాస్థలినుండి నెచ్చెలి.
వేగిరం పడుచు.

ఆవల నాతడు మెట్లదరిగా
అవనతానను డగుచు కుట్టిమ
మార్గమున నరుచేరసాగెను
మందగమనమునన్.

నిబ్బరము లేదెమో. లజ్జయొ :
విందుదృక్కులు విలుపజాలక
చూచితివి కడగంట నాతని
శుభ్రవదనంబున్.

నాలు గడుగులు వేసి యాతడు
వన్ను గమగొని వెతడ కమ్నల.
శిరము వాలిచి పోవసాగెను
శ్రీఘ్ర గమనమునన్.

శాంత

( ఉత్సాహముతో )

అవును సకియా, ఆత్రిలోచను
డగును గాక, ద్వితీయవారము

విలవగలుగునె కాంచకుండగ
నీముఖాబ్జంబునన్ ?

భ్రమర

అదియె వల్లభు నామధేయము !
ఆక్షణంబున నాకనుంగవ
కలిసిపోయిన దెట్లొ ఆయన
కలువ కన్నులలో.

నాసమీపద్వార సరణిని
నడచి లోనికి బోవు సదనున
వరపె నాపై నతడు దీర్ఘా
పాంగ వీక్షణమున్.

సఖియ, క్రిమ్మర వజ్రిలేప
స్థగిత వేదికమీద నుపవే
శించితివి జనియింప నలజడి
చిత్తకుంజములో.

శాంత

( వక్రిముగా జూచి చిరునవ్వుతో )

నిన్ను జూడగ మరల నేదో
నెపముపై నరుదెంచినాడా ?

అన్యథా యెటు లగుమ చెలీ, నీ
వయస్కాంతమవు.

భ్రమర

తిరుగ రాలే దతడు చెలియా.
ధీరచిత్తుని ఖాతి దోచెను.
యువతి గనుగొనినంత మాత్రిన
ఒడలు మరచు నొకో :

కట్టుకొని యున్నాడు సకియా,
పట్టుకమ్ముల దుకూలమ్మును
విడిచి చెంగులు, విండునడకను
వింత లీనంగా.

తాల్చియున్నా డర్ధబాహుల
ధవళ కూర్పాసమ్ము చెలియా,
తొంగి చూచుచునుండ వక్షో
ద్యుతులు కుతుకమునన్.

ఆమనోహర దీర్ఘ బాహువు
లందు లతికాశోభ కూడనో
కూడదో, మరి నాకుమాత్రిము
గోచరించినదే.

[illegible]

బాగు బా గోపిప్రియసఖీ, ఆ
బాహులతికలు నీ తనూలత
నల్లిబిల్లిగ నల్లుకొను లే
అచిర కాలములో!

( భ్రమర సిగ్గుతో లేచి, వాతాయనమున
గూడచుండి, ఉవవని నుపలక్షించును )

ఏది, ఇంచుక తిరుగు భ్రమరా,
ఈ కఠోర హిమాంశు రుచిలో
తేజరిలుచున్నావు గిరిజా
దేవి చందమునన్.

ఆ త్రిలోచనమూర్తి నీనయ
నామృతోర్మిల దేలియాడుచు
చెలియ, నీపదపట్టభంగ
శ్రేణి జేరును లే!

భ్రమర

( గంభీర వదనముతో )

అంత సులభం బైన దని తలంపగ రాదు!
అది కాక ప్రియసఖీ, ఆపదద్వయి జేరి
జీవితము సఫలమ్ము చేసికోవలె నేనె.

గ్రహియించితివా లేదా కాని నావల్లభుడు
చూడగా చూడగా సులభసాధ్యుడు కాడు.
ఉత్తమాన్వయమువం దుద్భవించినవాడు
సుగుణాలలో తనూశోభ కలిగినవాడు.

శాంత

అంత గుణవంతుండు కావున
ఆ త్రిలోచన మత్తగజపతి
భ్రమరికా కుచకలశవారీ
బద్ధు డయి పోవున్!

భ్రమర

( నవ్వి తల వంచుకొని )

ఆనాడు మొదలుగా అన్యోన్య వీక్షణము
పతకాలముదాక ప్రారంభించనే లేదు.
గమనించి యొకనాడు కంఠస్వరము నేనె
దూరమ్మునందుండి తొంగి చూచితి ప్రియుని.

నిర్విశేషమ్ముగా నిల్చెను నాపై కనులు.
తెమమ్ముగా మండె గండఫలక ద్వయము.
చెదరి యున్నది కేశజాలమ్ము విడి విడిగ
పాప, మాతడు బాధపడుచున్నటులు తోచె.

శాంత

చెప్పనేటికి ఎంక వేరుగ
చెలియ, నీపై రక్తి చేతనె
మౌనముగ కృశియించినా డా
మానవోత్తముడు !

భీమరావు

కాదు కాదే, కొంతకాలమ్మువకు గాని
అంకురించవనె లేదె అనురక్తి నాధునకు.
ప్రశ్నించినా డంట ప్రథమ పర్యాయంబు
నే నెవ్వ రని వధూనిక గాంచి యొకనాడు.

మాటమాటల నడుమ మరల నావృత్తాంత
మడిగినాడట చెలీ, ఆమీద నొకసారి,
మరియొక్కసారి యీమందభాగ్య భవిష్య
దాశాదులనుగూర్చి అడిగినాడట చెలీ !

పోవుచున్నార మీపురినుండి త్వరలోనె
అని వధూనిక తెలుప ఆవనమ్మున కళల్
తరిగిపోయిన వంట తక్షణమ్మే పక్షి !

కాంత

( మృదువుగా చపేటిక వేసి )

సంశయాత్మకురాల, ఆతవి
స్వాంత మతి వేలమ్మగా నీ
అలితరూప విలాసవాగుర
లగ్న మైపోయెన్.

భ్రమర

కుదట వడినది మనను, కోర్కెలీరికలెత్తె.
సాహసోద్దీప్తిమై సారెసారెకు నేనె
నిర్భరమ్ముగ నాదు నింపుచూపులతోడ
కనుగొంటి హృదయేశు కనులకరవే తీర.

ఆదిలో వల్లభుం డాలోల నేత్రాల
వీక్షించె నెచ్చెలీ, ఈషత్త్రపారేఖ.

పెడదకన్నులతోడ వీక్షించె నావలను,
ఆననమ్మున మందహాసాంకురము తోచె.

అవివాహితుడు ప్రియుం డన్నవృత్తాంతంబు
కర్ణజ్వరము పోవగా దెల్పినది వదిన.

## శాంతి

తావకార్ద్రాంత లోచన
ధాళధళ్యముచేత నాతని
వజ్రపంజర సన్నిభం బగు
స్వాంత మానాడే.

కరగి క్రమముగ పూవుదేనియ
కరణి సారళ్యంబు మధురిమ
సంక్రమింపగ త్వన్ముఖమ్ముగ
జాలు వారెనులే!

## భ్రమర

జాలువారినమాట సత్య మౌను: తదాది
వల్లభుం డనుదినము వచ్చుచుండెడివాడు
వీక్షణోత్సుకత మావీధి మందపునడల.

సకియరో, ఒకనాటి సందె చీకటివేళ
ద్వారభూమి నొకింత దాటిపోయినవాడు
నను గాంచి వెనుదిరిగి నాలుగడుగులు వేసె.

ధైర్యమ్ము పూని నే ద్వారసీమను జేర
అడిగె నాసేమమ్ము నమృత వాక్కులతోడ.

పట్టనమ్మును విడిచి పయనించు సమయమ్ము
దరియుచుండగ, నాకు తత్తరమ్ము జనించె.
ఉత్కంఠతో వేచి యుంటి దేహళిమీద
వల్లభాగమనంబు వాంఛించి యొకనాడు.

నా యదృష్టవశాన నాటిరాతిరివేళ
దీపావళీకాంతి దృగ్గోచరుం డైన
నాథుండు మెల్లగా నాసమీపమున జేరు
క్షణమునందే యెట్లొ గడపవెనుక బోయి
విర్నిమేషమ్ముగా విలుపంబడితి నేను.

నా మోము వీక్షించి నాథుడించుక యాగి
నరణినే మృదువుగా సాగిపోవుచు నుండె.

గుండె దడదడ గొట్టుగొనుచున్న నెట్టులో
తెమలించుకొని గొంతు, తెచ్చికోల్ ధైర్యాన
మందమ్ముగా రేపు మాప్రియాణం బంటి.

వాడుండు తోడనే నను జేరి చల్లగా
అప్పుడే పోదువా అయ్యో అని విట్టూర్చి
మన సమాగమ మెపుడు మరల అని ప్రశ్నించె.

## శాంత

మంచిమాట! ముందు నీవు
మాటలాడ కుందువేని
వెడలిపోవువాడె యతడు:
వియోగంబు తప్పనిదే!

## భ్రమర

తెరపు పడియె నో రెటులో
దేవికరుణ! కాని తగిన
బదులు పలుక జాలనైతి
ప్రాణేశ్వరుతోడ చెలీ!

ఏమొ తెలియ దంటి: పాప
మింత మొగము చేసికొన్న
వాడు డనియె మందముగా
నలుదిక్కులు చూచి యిట్లు:

"ఇంతటితో సరియేనా?
ఎన్నెన్నో ఆశ లున్న,
వంగణమ్ములోనికి నే
నరుదెంతున మాటాడగ!"

వదినయలికి దయనంపెనె
వల దంటిని లోని కతవి.
పాప మెంత మనసులోన
బాధ పడెనొ హృదయేశుడు!

"అటు లగుసెడ నీసేమ
మ్మప్పుడపుడు వ్రాయుదువా?
పంపుదువా నీఛాయా
పటము చూచుకొనుచునుందు!"

మౌనము వహియించితి నీ
మాటల కే మనుకొనెనో
హృదయేశుడు ప్రాణసఖీ!
ఎంత మందబుద్ధి నయితి!

ఇంతలోన కంఠరవం
బేతేరగ, ప్రియుడు నన్ను
విడువలేక విడువలేక
వెడలి పోవసాగె సఖీ!

అనుపదమ్ము వెను దిరుగుచు
ఆకర్ణాంతవిశాలము
లగు లోచనములు నాపై
అనురాగముతో బరపెను.

నిలిచి ద్వారదేశమందె
నిర్నిమేష నయనమ్ముల
జూచుచుంటి ప్రాణేశుని
చూపుమేరదాక సఖీ!

దివ్యపురుషభంగి దోచె
దీపికావళీవిరాజ
మానమూర్తి హృదయేశుడు
మార్గములో ప్రాణసఖీ!

పండుకొంటి లోని కరిగి
పర్యంకముపై, నూతన
వేదనతో ఆయామిని
వేగిపోయె ప్రాణసఖీ!

తెలియ లేదు ప్రియునివార్త
తీర్చలేదు ప్రియునికోర్కి
లోచదాయె ఉచితక్రియ,
పురదృష్టము, దురదృష్టము!

శాంత

అయినదానికి వింత ఆయాసపడ నేల?
చక్కపడులే ముందు శాంతించు ప్రియసఖీ!

మావ ఘానిక యున్న, మందమందాక్షముగ
పోవుచున్నా నంటి.—పూర్ణానురాగమ్ము
తొలుకాడు నేత్రాలతో ప్రియుడు నను గాంచి
శిరము పంకించి యెదో చెప్పబోయెను గాని
బంగారునోట ఏపలుకు రానేలేదు!

వన్నె తరిగిన జాలివదనమ్ములో నాథు
డుగు ముందుకు వేసె—అశ్వమ్ము సాగినది:
వీక్షణస్రజముతో వీక్షించి యొకమారు
అల్లనల్లన నాథు నంతర్హితుం డయ్యె.

శాంత

ఇంతకన్న నిదర్శనం బిక
నేమి కావలె నోసి, నీప్రియు
గాఢరాగ వ్యంజకమ్ముగ?
కంప మెందుల కే!

ఆత్మవిశ్వాసమ్ము కోల్పడి
నట్టు లున్నా వోసి యబలా,
భవద మోఘ మహార్ఘ రూప
ప్రాభవము మరచి!

అంతరం బిమ చింత యుండునె
ఆమలివం బగు ప్రేమలహరికి

కులము, సంపద, లోకవృత్తము
కూడ తాళవు పో!

ఆమహాగ్నిజ్వాలలో బడి
అన్నియును ద్రవియించి చెలియా,
దివ్యనూతన రూపరేఖల
దేజరిల్లు గదే!

### భ్రమర

అర్పించుకొందు, న న్ననుకంపతో మీరు
స్వీకరింపగ వలయు జీవితేశా! యనుచు
వంపుదును లేఖ యన, పదకర్త యైనట్టి
ప్రాణనాథునకు నాపలుకులో మాధుర్య
మెట్లు చాలును సఖీ, ఏమి చేయుదు నిపుడు!

### శాంత

(ఆలోచనా పూర్వకముగా)

మరల నీ వాపురికి జని నీ
మనోహరుని జూచి రా దగు
నొక్కసారి: వహింపవలె నీ
వోర్మి యందాకన్.

ఆ త్రిలోచనమూర్తి నీనయ
నామృతోర్మల దేలియాడుచు
చెలియ, నీపదపట్టభంగ
శ్రీజే జేరును లే!

పరిమదమున నీ ప్రాణనాథుని
బాహులతికలు నీతనూలత
నల్లిబిల్లిగ నల్లుకొను లే
అచిరకాలములో!

( భ్రమర మందహాసముతో తల
వాల్చును. ఉభయులును గాఢ
ముగా గౌగిలించుకొందురు )

## ఉత్తర భాగము

(సాయం సమయము. ధవళ ప్రగ్రీవములో నిషణ్ణకములమీద ఇద్దరుపవేశించి యుందురు)

### శార్జటి

నిజమే సఖా, ప్రేమ యుభయ
నిష్ఠమైన దగును సఖా !
అవల నేమి సంఘటిల్లె
నాలకింపవలతు సఖా !

### త్రిలోచనుడు

మరుదినమ్ము ప్రాణేశ్వరి
మాగృహాంగణమ్ము జేరి
భామినీజనమ్ముతోడ
భాషించుచునుండ గంటి-

ద్వారసీమ నిలుచునన్ను
వామలోచనములతోడ
నిపుణముగా నడుమ నడుమ
పెండురక్తి జూడ జొచ్చె.

ఎంతవింతకాంతు లీను
హృదయమేశ్వరికన్నదోయి !
ఒక కటాక్షమునకె నేను
ఉప్పరమున తెగసిపోదు.

ఏపికోలువేళ నెలప్ర
వేది పనెడితలపుతోడ
కాలయాపనమ్ము చేయ
గడగెనోయి ప్రాణప్రియ !

ఏమి పలుకదోయె గాని
ఎదుట ముదిత యుండుకతన
జాలి గొలుపువదనముతో
సారించిన దోయి దృష్టి.

గాటముగా నపుడు ప్రియను
కౌగిలించుకొనెడి తమక
ముదయించెను: మెల్లన ని
ట్టూరుపుతో లోని కేగి.-

సంభ్రమమ్ము పూర్ణముగా
శాంతించినపిదప మరల
దరిపినాడ నోయి సఖా,
ద్వారబంధవికటఘూమి.

ఉల్లగా మదీయనయనం
చకోరమ్ము లానసాగె
సఖీపూర్ణ వికచవదన
చంద్రికాజాల మపుడు.

పైటుచెరగులోన మరుగు
పరచి తెచ్చినట్టుతోచె
ప్రాణప్రియ తనఛాయా
పటము నాకు నొసగ సఖా!

అవకాశమె లేకపోయె
అందుకొనగ ప్రాణేశ్వరి
హస్తజలజయుగమునుండి
ఆయనర్ఘ బహుమానము.

చివర కెటులొ హృదయేశ్వరి
'సెలవు పోయి వత్తు' ననగ
మందహాసవదనుడనై
మంచిది శుభ మంటి సఖా!

ధూర్జటి

అనల సఖా, నీప్రేయసి
అభిజనమ్ము ప్రాపించుచు
ప్రణయలేఖ వ్రాసినదా?
పంపినదా చిత్రపటము?

## త్రిలోచనుడు

లేదు సఖా, నాకు తెలియ
లేదు సఖా, ప్రాణేశ్వరి
వార్త లేమికూడ సఖా !
వాడిపోయినాను సఖా !

బహుళపక్ష మైనపిదప
ప్రాణసఖీముఖ సుధాంశు
మండలమ్ము తోచె నొక్క
మారు హఠాత్సంభవముగ.

నన్ను గాంచి విప్పారిన
నయనాంబురుహమ్ములతో
చేసె నమృతసేచనమ్ము
చిగురు దొడుగ నెడద సఖా !

ఆవిలోకన క్షణమ్ము
నందు సఖా, హృదయేశ్వరి
భ్రూవల్లులు ధనురాకృతి
బూనిన నతిచిత్రముగా,

చిత్రరత్నకంబళా
సీన మైనభ్రమరికా
లలితముఖాంభోరుహమ్ము
లజ్జచే వాలిపోయె.

ఆమె యంతికమున కే
నల్ల నల్ల పోవుచున్
పల్కరింపగా మధుర
భాషణములతో ప్రియన్-

'ఏమి ప్రియా, నీకు నై
ఎదురు చూచుచున్నాను
దినము దినము, వా ర్తయే
తెలియనే తెలియలేదు.

'కుశలమా? ఇచట నీవు
కొన్నిరోజు లుందువా?
మనము రహస్యమ్ముగా,
మాటలాడు కొందమా?'

'వీలు కానరా దిచట,
వెడలి పోవుచున్నాను
శీఘ్రముగా మాయూరు-
చెప్పలేను క్షేమ మని?'

అన్న దోయి ప్రియురాలు.—
అంతలో నెవరో యచటి
కరుగు దేర, మరలినా
నన్య కక్ష్యలోపలకు.

పోవుచుండ బంగారు
బొమ్మ నడుమ నడుమ నా
వదన మీక్షించుచుండె
వాలుచూడ్కి సారించి.

మరల నే బలుకరింప
మందహాస చంద్రికా
మంజులాననము వాల్చి
మారు పలుక లేదోయి !

నాలుగైదడుగు లేమ
నడువగా వెనుకదిక్కు
వినంబడెను తలుపోర
వేసినట్లు మందముగ.

ధూర్జటి

పరులు చూతు రేమొ యనెడి
భయముచేత నీ ప్రేయసి
ఆవిధాన వర్తించిన,
దనురాగము లేక కాదు.

## త్రిలోచనుడు

అవును సఖా, నిజమె సఖా,
ఆర్ద్ర హృదయురాలు సఖా,
శాంతమూర్తి హృదయేశ్వరి
జాగరూకురాలు సఖా!

అపుడు నేను కౌతుకమ్ము
నణచుకొనుచు పురోవర్తి
కక్ష్యలోన ప్రవేశించి
కవాటమ్ము తెరచి యుంచి-

శయ్యమీద బవ్వళించి,
శాంతముగా జూచుచుంటి
ప్రాణేశ్వరి యున్నవైపు
బాహుయుగళ మల్లెవేసి.

కదచి యు డనోవు రెంతు
గడియ లావిధాన, భ్రమర
తుదకు ద్వార మోర చేసి
తొంగి చూచె నోయి సఖా!

ప్రాణేశ్వరిం గాంచు ప్రథమ క్షణమునందు
నాట్యమ్ము చేసినది వయనద్వయ మొకింత,
తెలియకుండనె లేచితివి శయ్యపైనుండి.

పరకీయ యామె యని భావింపకున్నావు-
అరుదేర నామె నీ కప్రతిష్ఠ ఘటిల్లు.

బంధువర్గము కల్గు బ్రాహ్మణుండవు నీవు
ధర్మప్రకారమ్ము తగుకన్నె బెండ్లాడి
వాంఛింప కాత్మీయవంశాభివృద్ధి! యీ
వక్రమార్గమునందు వర్తింతువా వత్సా!

త్రిలోచనుడు

(ఆలోచించి)

నీవాక్యమ్ములు నిజమే యయినను
వరించు వనితను వర్జించుటయా!
భావికాలమున బంగరుబొమ్మకు
లేశము సౌఖ్యము లేనే లేదా!

ధూర్జటి

పరకీయకునై బాధపడుదువా
నిజహిత మేమో నిర్వహింపవా?

త్రిలోచనుడు

ఆమెకు నాపై ననురాగము లే
దని గ్రహించుచో నపుడు శమింతును.

## ధూ ర్జ టి

(మందహాసము చేసి)

తాను వలచినవి త్రైలోక్యేందిర
తాను మునిగినది దైవతనిమ్నగ ;

ఈ ప్రేమలు నే నెరిగినవే గద,
ఇవి శాశ్వత మని యెన్నడు నమ్మను.

బాధ యయిన నీభ్రమరిక నెటులో
మరచిపోవుటయె మంగళ మగు సఖ ;

## త్రి లో చ ను డు

మరచు టెట్టులు దివ్యమంగళా కారంబు
సౌందర్యసారంపు సముదాయసదనంబు
త్రిజగతీలావణ్య తీర్థప్రదేశమ్ము
అత్యంతికకఠోర యౌవనామృతపాత్రి
మఖిలలోకఃపుంజ హారిమణిదర్పణము
ప్రద్యుమ్నశాణిత ప్రసవనారాచమ్ము.

## ధూ ర్జ టి

పదకర్త దైవనీప్రజ్ఞ విశదం బాయె,
ఉద్రేకము త్యజించి ఉజ్జగింపుము యువతి.

అనురాగ మనురాగ మని తపించెద వేల ?
ఆధునికబాధలకు నదియె మూలం బోయి!

## త్రిలోచనుడు

( కొంతతడ వాలోచించి )

శాంతం శివ మద్వైతమ్!
సత్యముగా వీజతనము
ఎన్నటికిని చేయ నోయి
ఈమె సమాగమముకొరకు.

అనురాగము లేనిపట్ల
అనదనోలె కుమిలి కుమిలి
తపియించెడివాడ ననుచు
తలపడోకు ప్రాణసఖా!

సకల ముజ్జగించి ఖ్రిమర
సాహసించి వచ్చునేని
స్వీకరింప దగునొ తగదొ
చెప్పు మోయి ప్రాణసఖా!

### ధూర్జటి

సంఘటిల్లిన యేని సత్యమ్ముగా అట్టి
ఉత్పాతమే, అపుడు యోజింపవచ్చువే.

### త్రిలోచనుడు

పడగల్గుదు నే బాధలు సఖుడా,
భరింపజాలను పరపీడనమును.
భ్రమరకు తూష్ణీంభావము కలిగిన
అవివేకిని కా నంగలార్చుటకు!

రక్తి లేనియెడ రసికుండగు వా
షూగులాడు నొకా యువతి కోసమై.

### ధూర్జటి

పీ వ్రతిజ్ఞపయి నిలిచి యుందు వని
భావించెద నిక పరమహర్షమున.

( ఇంతలో గంట వినబడును. త్రిలోచనుడు మెట్లు దిగి లేఖ అందుకొని వచ్చి, చదువుకొని ధూర్జటి చేతి కిచ్చును. అతడు బిగ్గరగా లేఖ చదువును.)

" జగతిలో నాకన్న సంశయాపన్న
ఈవాడు మెలగునే యెవ్వతె యైన!

పరిణయావస్థయే బాధాకరంబు
ప్రకృత స్థితియుగూడ భయదరూపంబు

అంధకారమునందు అల్లాడుచుండ
కానంబడియె దీపకళికార్చి నాకు.

హృదయంబు ద్రవియింప నిచ్చగించితిని
అద్దాని దీప్తినే అనుసరింపంగ.

తలపోసి ధైర్యమ్ము పూని
వేళకు సమముగా వీవగా జొచ్చె
సంశయానిల, మంత సాధ్వసం బొదవె.

అత్తవారింటి కే నడుగుట కల్లః
ప్రియుని జేరగ నేదొ భీతి జనించు.

నవనీత హృదయుండు నా మనోహరుండు
నా ప్రవర్తనమున నవయునో యేమొ.

వాలితి తత్పాదవనజయుగ్మమున
అబలను కరుణతో నాశీర్వదింప.

ఆపాదపద్మాలె అవలంబనమ్ము
అగుగాక యీదీనురాలి కెల్లపుడు."

నీ వన్నట్టులు విక్రముగానే
యోగ్యురాలె యీ యువతీరత్నము.

ఉభయులకును శ్రీమ మొదవకుండగనె
తెలివితోడ విడదీసెను గ్రంథిని.

ఏమందువు నీ విపు డీతరుణిని :
స్థైర్యము కల్గిన సరసమతివి సఖ !

## త్రిలోచనుడు

స్ఫటికం బీహృదయం బది
సఖుడా, నీ కవగతమే.
సవిధవస్తువర్ణం బిట
జాయమాన మగుచునుండు.

ఈ చాతుర్మాస్య వ్రత
మెంత సుఖద మైన దోయి !
భావలోక విహారణమున
పరిపూర్ణత గాంచినాను.

జీవన గ్రీష్మర్తువులో
శీతలంపు సుధావ్రిపను

దరివివట్టి మధురస్మృతి
తరంగితం బగుచు నుండు.

నేను వలచినట్టి చెలికి
నిత్య మంగళమ్ము ! నాకు
పొంది శివానుగ్రహమున
శాంతి శ్శాంతి శ్శాంతిః !

1938–39

సమాప్తము